# హరహరి మహిమ్నః స్తోత్రము

(శ్రీ గంధర్వరాజు పుష్పదంతుడు)






అనువాదము:

చర్ల గణపతి శాస్త్రి

హ ర హ రి

# మహిమ్నః స్తోత్రము

## సంస్కృతము

మహిమ్నః పారంతే పరమవిదుషో యద్యసదృశీ
స్తుతిర్బ్రహ్మాదీనామపి తదవసన్నాస్త్వయి గిరః
అథావాచ్యః సర్వః స్వమతిపరిణామావధి గృణన్
మమాప్యేష స్తోత్రే హర నిరపవాదః పరికరః.

## తెనుగు

నీమహిమంపు టంతు గన నేరనినే నెటు నిన్ స్తుతింతు నం
టే, మతి బ్రహ్మ లోనగు సురేంద్రులు పూర్వము నిన్ స్తుతింపరే
ఈ మహి నెల్లరున్ తమమనీషకొలంది స్తుతింప నర్హులే
నీ మహిమన్ స్తుతించుటకు నేనహరా! యిటు పూన నర్హమే.

## స్తోత్ర సంబంధియగు కథ

ఒక గంధర్వరాజు ప్రతిదినము ఒకరాజు పూలతోఁటలోని పూవులను గోసికొనిపోవు చుండెడివాఁడు. ఎవరు పూవులనుగోసికొనిపోవు చున్నారో తెలిసికొనుటకై రాజు శివనిర్మాల్యమును దారిలో ఉంచి ఈ శివనిర్మాల్యమును దాఁటిన వారికి ఉన్న అంతర్ధానాది శక్తులు పోవుఁగాకఅని యనెను. అది తెలియక గంధర్వరాజు మామూలు ప్రకారము ఆతోఁటలో ప్రవేశించుచునే శక్తిహీనుఁ డయ్యెను. పిదప తనశక్తి పోవుటకుఁ గల కారణమును ధ్యానముచే తెలిసికొని సర్వకామదాతయును పరమ కారుణికుఁడును అయిన భగవంతుని స్తుతించెను. ఆ స్తు

తియె ఈ మహిమ స్తోత్రము. దీనిని సంస్కృతములో 'మహిమ్నః స్తోత్రం' అందురు. దీనికి శ్రీమత్పరమహంస మధుసూదన సరస్వతి హరిహరుల పక్షముగా టీక వ్రాసెను. ఆ టీకను అనుసరించి హరిహరపక్షముగానే నాచే యథాశక్తి అనువదింపంబడినది. దీనిని సహృదయులు పఠించి గ్రహింతురు గాక.

## అర్థ తాత్పర్యములు

హరపక్షమున :- నేన=నేనే. హరా!=ఈశ్వరా! ఇటుపూనుట అర్థమే, హరిపక్షమున :- నేమ + అహరా! అనిపదవిభాగము హరా =హరుఁడు అనఁగా జగములను హరించువాడు. అహరుఁడు=జగములను హరింపనివాఁడు అనఁగా పోషకుడు అని యర్థము. అహరా!=ఓ లోకపోషకుడైన హరీ! నేను ఇటులు పూనుట అర్థమే అని భావము, మిగిలిన దంతయు రెండు అర్థములందు సమానమే.

## సంస్కృతము

**అతీతః పంథానం తవ చ మహిమా వాఙ్మనసయో
రతద్వ్యావృత్త్యా యం చకితమభిధత్తే శ్రుతిరపి
స కస్య స్తోతవ్యః కతివిధగుణః కస్య విషయః
పదే త్వర్వాచీనే పతతి చ మనః కస్య చ వచః**

## మహిమ్నః స్తోత్రము

### తెనుఁగు

నీమహిమంబు వాక్కులకు సెమ్మదికందదు. దానినిన్ శ్రుతుల్
వేమఱు ద్వైతశూన్యముగ భీతిలి జంకుచు వెల్లడించెడిన్
ఆమహిమన్ స్తుతింపనెవడర్హుఁ డదెట్టిదొ, దేనఁ గానన్;
నీ మహి నేఁటిరూపులనొ యెవ్వనివాక్కు మనంబు ప్రాలవే॥

హరపక్షము :- నేఁటిరూపులు=ఈశ్వరుని కున్న ఇప్పటి ఎద్దు వాహనము భూష లగుపాములు చర్మము పార్వతి మొద లగు రూపులు, హరిపక్షమున:- నేఁటిరూపులు=విష్ణువున కున్న శంఖ చక్రగదాది సహిత చతుర్భుజాది రూపములు.

### సంస్కృతము

మధుస్ఫీతా వాచః పరమమమృతం నిర్మితవత
స్తవ బ్రహ్మన్ కిం వాగపి సురగురోర్విస్మయపదం
మమ త్వేతాం వాణీం గుణకథనపుణ్యేన భవతః
పునామీత్యర్థేఽస్మిన్పురమథన బుద్ధిర్వ్యవసితా.

### తెనుఁగు

సరసపు వాక్కులందమృతసారము చిప్పిలఁ జేయునో ప్రభూ
సురగురువాక్కు దేవతయుఁ జోద్యము నీకొనఁ గూర్పఁజాలునే
పురమథనా! మదీయ గుణపూరిత వాణిని సద్గుణోక్తి పు
ణ్యరసములన్ బునీతము పొనర్తు ననటంచుఁ బూనితే మతిన్.

వివ: హరపక్ష:- సురగురు=బ్రహ్మయొక్క వాక్కు దేవతయు= భార్య అగు సరస్వతీ దేవియు, పురమథనా=శత్రుపురములను

వధించిన శివా! మదీయ గుణపూరితవాణిని=నాస్వల్పగుణములు గల వాక్కును, నీ సద్గుణోక్తిపుణ్యరసములచేఁ బునీతము చేయుదునని మతిని పూనితిన్ + ఏను. నేను హరిపక్ష:- సురగురు =సురులకుఁబెద్దయైనహరీ! వాక్కు దేవత=సరస్వతియు, పురమథనా! మథనము=మథింపఁబడినక్షీర సముద్రపురము నివాసముగాఁ గలవాఁడా! మదీయ గు=సంసారకలుషిత మైన అహంకారగుణములతో, పూరితమైన నావాక్కును నీ సద్గుణోక్తి పుణ్యరసములచే పవిత్రము చేయుదు నని. మతిన్ బుద్ధిలో పూనితివి + ఏ. పూనితివా ఏమి.

సంస్కృతము

తవైశ్వర్యం యత్తజ్జగదుదయరక్షాప్రళయకృత్
త్రయీవస్తు వ్యస్తం తిసృషు గుణభిన్నాసు తనుషు
అథవ్యానామస్మిన్ వరద రమణీయామరమణీం
విహంతుం వ్యాక్రోశీః విదధత ఇహైకే జడధియః

తెనుఁగు

జగముల్ సృష్టి యొనర్పఁబెంపవలయము న్ జల్పన్
గుణాలోప్రిమూఁ దగుదేహంబుల భిన్నమై శ్రుతుల వేద్యంబౌ
త్వదైశ్వర్యమున్ తెగడంగన్ వరదా! యిటన్ శుభము లేదే
యన్న యప్రాజ్ఞర మ్యగుణోద్ఘోష నొకంద్రమూర్ఖుల
మనోజ్ఞానిత్వతఁ గావిం త్రిలన్.

వివ: హరపక్ష:- ఇటన్=ఈలోకములో శుభము లేనే లేదు అను అప్రాజ్ఞ=అ+ప్రాజ్ఞులయొక్క రమ్యగుణోద్ఘోషణను, ఒకంద్రే

## మహిమ్నః స్తోత్రము

మూర్ఖులు అమనోజ్ఞ గుణోద్ఘోషణలతోఁగూడినదిగాఁజేయుదురు. హరివక్ష:-ఇటన్=ఈనీయైశ్వర్యములో శుభము లేనే లేదుఅను అప్రాప్రజ్ఞ,ప్రి+అజ్ఞరమ్య ప్రాజ్ఞరమ్య,అ+ప్రాజ్ఞరమ్యగుణ= అజ్ఞుల రమ్య భిన్న గుణములుగలఉద్ఘోషను ఒకండ్రు మూర్ఖులే ఒకండ్రు+అమూర్ఖులే ముఖ్యులైన కొందఱు జ్ఞానులే మనోజ్ఞా న్వితన్=రమణీయముగఁ జేయుదురు. అనఁగా నీయైశ్వర్య ములో శుభమున్నదని రమణీయముగాఁ జేయుదురని భావము ఈ క్రింది యర్థములు రెండింట సమానమే. తెగడంగన్=నిర సింపఁగా గుణాలు=సత్త్వరజస్తమోగుణములు. మూఁడగు దేహంబులు=బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపదేహములు.

## సంస్కృతము

కిమీహః కింకాయః స ఖలు కిముపాయస్త్రిభువనం
కిమాధారో ధాతా సృజతి కిముపాదాన ఇతిచ
అతర్క్యైశ్వర్యే త్వయ్యనవసరదుఃస్థో హతధియః
కుతర్కోఽయం కాంశ్చిన్ముఖరయతి మోహాయ జగతః

## తెనుఁగు

ఈ యేయూహకు నందరాని సిరితో నేపారు నిన్గూర్చియే
"ఏ యత్నంబున, నేయుపాయములతో,నేయేయుపాదానమున్
ఏ యాధారము పెట్టిమేనుగొని సృష్టించెన్ జగాల్ ధాత" యం
చే యావ్యర్థకుతర్క మజ్ఞులను బ్రేలించున్ జనుల్ భ్రాంతిలన్॥

# మహిమ్నః స్తోత్రము

## అర్ధ తాత్పర్యములు

వివ :- ఏయుపాదానమును—ఏముఖ్యకారణమును. కుండకు మట్టి యుపాదానకారణము అట్లే జగత్తును సృజించుటకే ఏ ముఖ్యకారణమును గ్రహించి ధాత ఏ యత్నముచే ఏ యుపాయాదులచే జగత్తును సృష్టించెను అనునట్టి యీవ్యర్థకుతర్కము మోహపడ అజ్ఞులచే ప్రేలించునని భావము.

## సంస్కృతము

అజన్మానో లోకాః కిమవయవవన్తోఽపి జగతా
మధిష్ఠాతారం కిం భవవిధిరనాదృత్య భవతి
అనీశో వా కుర్యాద్ భువనజననే కః పరికరః
యతో మందాస్త్వాం ప్రత్యమరవర సంశేరత ఇమే.

## తెనుఁగు

జగముల్ సావయవంబు లయ్యు నిటులన్ జన్మింపకే యున్న వా
తగు నేకర్తయు లేకె లోకములకున్ తత్సృష్టి యేమాయె,యా
భగవంతుండే యివానర్పఁడేన్ జులువునెవ్వాఁ, డెట్టిసామగ్రితో,
నగు; నైనన్ జడు లిట్లు నిన్ను నమరేశా! సంశయింత్రే గదే.

వివ:- క్షిత్యాది జగములు సావయవములుగానవానికిఁ గర్త యగునీశ్వరుఁడున్నాఁడనుట నిశ్చయము అని భావము.

## మహిమ్నః స్తోత్రము

### సంస్కృతము

త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ
రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిలనానాపథజుషాం
నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ

### తెలుఁగు

నిగమాల్ సాంఖ్యము యోగపాశుపతమున్ శ్రీవైష్ణవం బంచువే
ఱగుప్రస్థానము లందు మే లిదియె పథ్యంబద్దె యంచున్ రుచిం
దగు వైచిత్ర్యముఁబట్టి వక్రఋజునానారూపసంప్రాప్తమా
ర్గగు లౌవారల కీవ గమ్యుఁడ వతర్క్యా! నీళ్ల కబ్ధింబలెన్.

వివ :- యోగపాశుపతము=యోగసహితపాశుపతముమ యోగమును పాశుపతమును అని భావము. నిగమాలు=వేదములు. సాంఖ్యము, యోగము, పాశుపతము వైష్ణవము అనునవి సర్వశాస్త్రములకు ఉపలక్షణము. ఆయా శాస్త్రములకు రూపమైన నానా మార్గములవెంట వెళ్లువారికి నీవే పొందఁదగినవాఁడవని భావము. ఇట మధుసూదనసరస్వతిచే సర్వశాస్త్రములు వాని వివరములు టీకలో వివరించఁబడెను. విస్తరభీతిచేఁ దెలుపఁబడలేదు. అవి సంగ్రహించి చూపఁబడును. విస్తరముగా నాచే రచించబడిన ప్రస్థానభేదము (విద్యలు=కళలు) అను గ్రంథమునఁ జూడనగును. 1 ఋగ్వేదము 2 యజుర్వేదము 3 సామవేదము 4 అథర్వ వేదము అని వేదములు నాలుగు. 1 శిక్ష 1

కల్పము 3 వ్యాకరణము 4 నిరుక్తము 5 చందస్సు 6 జ్యోతిషము అని వేదాంగములు ఆరు. 1 పురాణములు 2 న్యాయము 3 మీమాంస 4 ధర్మశాస్త్రములు అని ఉపాంగములు నాలుగు. ఉపపురాణములు పురాణములందు అంతర్భవించును. వైశేషిక శాస్త్రము న్యాయమందు, వేదాంతశాస్త్రము మీమాంస యందు మహాభారత రామాయణములు సాంఖ్య పాతంజల పాశుపత వైష్ణవాదులు ధర్మశాస్త్రములందు అంతర్భవించును. ఇట్లుఅన్ని విద్యలు పదునాలుగు. ఇవే ఆయుర్వేదము ధనుర్వేదము. గాంధర్వ వేదము అర్థ శాస్త్రము అను నాలుగు ఉపవేదములతో గలిపి పదునెనిమిది విద్యలు అగును. ఇవి వేదానుసారులయిన విద్యలు మాధ్యమిక యోగాచార సౌత్రాంతిక వైభాషిక సౌగతచార్వాక జైనుల మతములు నాస్తికములు గాన అవి ఇందు సంగ్రహింపబడలేదు. అందు ధర్మమును బ్రహ్మమును ప్రతిపాదించు నట్టి యపౌరుషేయ వాక్యము వేదము. అది కర్మకాండము జ్ఞానకాండము అని రెండువిధములు. కర్మకాండము ధర్మార్థకామములకుఁ గారణము. జ్ఞానకాండము మోక్షమునకు గారణము. యజ్ఞములు నిర్వహించుటకై ఋక్కు, యజుస్సు, సామము అని వేదము భిన్నమైనది. అందు హోత ఋగ్వేదము చేతను, అధ్వర్యువు యజుర్వేదము చేతను, ఉద్గాత సామవేదముచేతను యజ్ఞవిధి నిర్వహించును. ఋగాది ప్రయోగ భేదమును బట్టి ఋత్విక్కులకు హోత మొదలగు పేర్లు కలిగినవి. విషయ భేదమును బటి ఆవేదము సంహిత బ్రాహ్మణము అరణ్యకము ఉపనిషత్తులు అని నాలుగు విధములు సంహితఅగ్నిం

## మహిమ్నః స్తోత్రము

ద్ర వరుణాది దేవస్తుతి రూపమైన మంత్రములు గలది. బ్రాహ్మ ణము కర్మకాండ విధులను దెలుపునది. అరణ్యకము అరణ్య మందు జరిగిన జ్ఞానాది చర్చాదులను దెలుపునది.

ఉపనిషత్తులు—జ్ఞానభోదకమైనవి శిక్ష—వేదమందలి యు దాత్తానుదాత్త స్వరిత హ్రిస్వ దీర్ఘప్లుతాది సహిత స్వర వ్యంజ నోచ్చారణ ప్రయోజనముకలది. దీని రచయిత పాణిని.

కల్పము:— వైదికానుష్ఠానక్రమ విశేషజ్ఞాన బోధకసూత్రములు వీనికి వసిష్టాదులు కర్తలు.

వ్యాకరణము:— వైదిక లౌకికపదసాధుత్వా సాధుత్వ బోధకము పాణిని వరరుచి పతంజలి దీని కర్తలు.

నిరుక్తకము;—యాస్కాచార్య రూపిత మైననామాఖ్యాతనిపాతో పసర్గరూప పదజాతము వానివ్యుత్పత్తి. వైదికద్రవ్యదేవతా పర్యాయాదిబోధక నిఘంటువు. అమరాధి నిఘంటువులును.

ఛందస్సు:— పింగళనాగునిచే రచితమైన పద్య ఛందస్సు.

జ్యోతిషము:—వైదికకర్మాంగ దర్శాదికాలజ్ఞాన బోధకము. అదిత్య భర్గాది రచిత శాస్త్రము.

పురాణములు;—సర్గ ప్రతిసర్గ వంశ మవ్వంతర వంశాను చరిత ప్రతి పాదకములై వ్యాసప్రోక్త మగునని పురాణములు. అవి

## మహిమ్నః స్తోత్రము

1 బ్రాహ్మము 2 పాద్మము 3 వైష్ణవము 4 శైవము 5 భాగవతము 6 నారదీయము 7 మార్కండేయము 8 ఆగ్నేయము 9 భవిష్యము 10 బ్రహ్మవైవర్తము 11 లైంగము 12 వారాహము 13 స్కాందము 14 వామనము 15 కౌర్మము 16 మాత్స్యము 17 గారుడము 18 బ్రహ్మాండము అని పదునెనిమిది. ఉపపురాణము అనేకములు. న్యాయము=గౌతమరచితము వైశేషికము=కణాదరచితము

మీమాంస;- కర్మ మీమాంస (జైమిని రచితము) శారీరక మీమాంస (వ్యాసరచితము-వేదాంత సూత్రము)

ధర్మశాస్త్రము;-మనుయాజ్ఞవల్క్యాదులచే రచితములు మహాభారత రామాయణేతిహాసములు. సాంఖ్యాదులు కపిల రచితములు

## ఉపవేదములు

అయుర్వేదము:- బ్రహ్మప్రజాపతి శివధన్వంతరింద్రాది ప్రణీతము, కామశాస్త్రము(వాత్స్యాయనరచితము) దీనికి విషయ వైరాగ్యమే ప్రయోజనము.

ధనుర్వేదము ;-విశ్వామిత్ర ప్రణీతము.

గాంధర్వశాస్త్రము;- భరతముని ప్రణీతము

## మహిమ్నః స్తోత్రము

అర్థశాస్త్రము;- బహు విధము. నీతిశాస్త్రము అశ్వశాస్త్రము గజ శాస్త్రము శిల్పశాస్త్రము సూపకారశాస్త్రము చతుష్షష్టికళాశాస్త్రము అని గీత వాద్యాదులు కళలు.

పాశుపతము;- భగవంతుఁడైన పశుపతిచే పాశుపాశ మోక్షము కొఱకుఁ జెప్పబడినది. శైవము మంత్రశాస్త్రను పాశుపతాంతర్గతమే.

పాంచరాత్రము:-వైష్ణవనారదాదులచే రచితము. వైష్ణవమంత్రశాస్త్రము పాంచరాత్రాంతర్గతమే, వామాగమాదిశాస్త్రములు మాత్రము వేద బాహ్యములు ఇవన్నియు సాక్షాత్తుగాఁగాని పరంపరగాఁ గాని పరమేశ్వర పర్యవసాయకములే

ఇది అష్టాదశ విద్యలవివరము

---

## సంస్కృతము

మహోక్షః ఖట్వాంగం పరశురజినం భస్మ ఫణిః
కపాలశ్చేతీయత్తవ వరద తంత్రోపకరణం
సురాస్తాంతామృద్ధిం దధతి తు భవద్భ్రూప్రణిహితాం
న హి స్వాత్మారామం విషయమృగతృష్ణా భ్రమయతి

## మహిమ్నః స్తోత్రము

### తెనుఁగు

సుమహోక్షంబును భస్మశుద్ధఫణితోల్ శోభిల్లుఖట్వాంగము
గ్రమ మౌగొడ్డలియున్గపాలసరమున్ గామపశ్రిదా!యింతే యిం
ట మహాసంపద, కాని నీదుకనుసన్నన్ దేవులైశ్వర్య మెం
త మహత్తొందిరి; త్రిప్పవాసమ్ము గత్పష్ణల్స్వాత్మరామున్వినున్

వివ: హరపక్షః- సుమహా + ఉక్ష + మంచి పెద్దయెద్దు, భస్మ, ఫణీ=పాము తోల్=చర్మము ఖట్వాంగము=ఒకానొకయాయుధము మొదలగునవి గలవాఁడు హరుడు. స్వాత్మరామున్ నీయాత్మలో రమించు నిన్ను ఆశలు త్రిప్పలేవు. హరిపక్ష;-సుమహన్= మంచితేజస్సుగల అక్షము=చక్రము. భస్మవెలె శుద్ధమైన ఫణితోలు=ఆదిశేషుని చర్మము శోభిల్లు ఖట్వాంగడూ=పర్యంకము గొడ్డలి పరశురామావతారమున దాల్చబఁడెను. కపాల=కేన జలేన పాల్యతే=జలముచే పోషింపఁబడుపద్మము. సరము=మాల ఇవి విష్ణువు దరించునవి. స్వాత్మరామున్=తన యాత్మయే రాముఁడుగానైన నిన్ను ఆశలు త్రిప్పలేవు.

### సంస్కృతము

ధ్రువం కశ్చిత్సర్వం సకలమపర స్త్వధ్రువమిదం
పరో ధ్రౌవ్యాధ్రౌవ్యే జగతి గదతి వ్యస్తవిషయే
నమస్తేఽప్యేతస్మిన్ పురమథన తైర్విస్మిత ఇవ
స్తువన్జిహ్రేమి త్వాం న ఖలు నను ధృష్టాముఖరతా

## మహిమ్నః స్తోత్రము
### తెనుఁగు

స్థిర మిది సర్వ మం చొకళు చెప్పెద, రస్థిర మెల్ల నంచు నొ
క్కరువచియింతు, రస్థిర మొకింతయొకింత స్థిరంబు నంచునొ
క్క రనెదఁరీసమ స్తమునఁ గల్గెడి తీరుల విస్మితుం డటుల్
పురమథనా! నినున్ బొగడ రోయను, వాగుడు మొంటిదే గదా.

వివ:- సాంఖ్య పాతంజల మతానుసారులు సర్వము స్థిరము అని అందురు. లేనిది పుట్టదు, వున్నది పోదు. పుట్టుక యనఁగా కారణరూపముగానున్న దంతయు కార్యరూపముగాఁ బైకిఁగనిపించుట నాశనము అనఁగా కార్యముగా నున్నది. కారణ రూపముగా నుండుట యని వారిమతము. సర్వమును అస్థిరము క్షణికము అని సౌగతమతానుయాయులు. ఈ క్షణముననున్నది. మఱి తరువాతి క్షణమునను౦డదని వారు అందురు. అర్థక్రియాకారిగా నుండుటయే సత్త్వము అని వారు అందురు. కొంప స్థిరము కొంత అస్థిర మని తార్కికులు. ఆకాశ కాల దిగాత్మ మనస్సులును పృథివి నీరు తేజస్సు వాయువుల పరమాణువులును నిత్యమని, కార్యద్రవ్యములు అనిత్యములు అని వారందురు.

### సంస్కృతము

తదైశ్వర్యం యత్నాద్యదుపరి విరించిర్హరిరధః
పరిచ్ఛేత్తుం యాతావనలమనలస్కంధవపుషః
తతోభక్తిశ్రద్ధాభరగురుగృణద్భ్యాం గిరిశ యత్
స్వయం తస్థే తాభ్యాం తవ కిమనువృత్తిర్న ఫలతి.

## మహిమ్నః స్తోత్రము

### తెనుఁగు

అమలజ్యోతిసమూహమై తనరు నీదైశ్వర్యమున్ గొల్వ నూ
ర్ధ్వముగా బ్రహ్మయుఁగ్రిందికేగి హరి,కొల్వం జాలఁగా నేరరై
రమలశ్రద్ధను భక్తి నిండి స్తుతి చేయన్ వారికై తానె నీ
దు మహైశ్వర్యము లోఁచె; నోగిరీశ! యెందున్ భక్తి సిద్ధింపదే

వివ: హరపక్ష:- గిరీశ!=గిరియందుండు నోశివ. హరిపక్ష:-
గిరీశ=గోవర్ధగిరియం దుండు విష్ణువా! బ్రహ్మ, హరి=పాము
ఆదిశేషువును నీయంతు చూడలేక పోయిరి.

### సంస్కృతము

అయత్నాదాసాద్య త్రిభువనమవైరవ్యతికరం
దశాస్యో యద్బాహూనభృత రణకండూపరవశాన్
శిరఃపద్మశ్రేణీరచితచరణాంభోరుహబలే
స్థిరాయాస్త్వద్భక్తేస్త్రిపురహరవిస్ఫూర్జితమిదమ్.

### తెనుఁగు

అపగతవైరహేతుఁగ దశాస్యుఁడు సుల్వుగ ముజ్జగంబు వో
ది పిదప యుద్ధపుం దురద తీరనిబాహుల నొప్పె; నియ్యదో
త్రిపురహరా! బలిప్రహిత దీక్షిత శీర్షసరోజపంక్తి ర
మ్యపద! ధ్రువంపుఁదావకమహామలభక్తి విజృంభణంబె గా.

## మహిమ్నః స్తోత్రము

వివ: హరపక్షః-రావణుడు తపస్సు చేయుచు శివపూజకై తన శిరస్సుల నరకెనని కథ. బలిప్రహిత=బలిగాఁ జేయఁబడిన. దీక్షిత=దీక్షగల శీర్షసరోజపంక్తిరమ్యపద!=శిర; పద్మపంక్తిచే రమ్యమైనపాదములు గలవాడా! హరిపక్షః-త్రిపురహరా!= జాగ్రత్స్వప్న సుషుప్తి రూప త్రిపురములను హరించి మోక్షమునిచ్చువాడా! బలిచక్రవర్తిచేఁ జేయఁబడిన దీక్షగల, శిరస్సులను పద్మవీథి (త్రివిక్రమావతారములో) యందు రమ్యమైనపాదములు గలవాఁడా! జయవిజయులు రావణకుంభకర్ణులు కొన్ని జన్మలు వ్యవధాన మున్నను నీభక్తిచేతనే అంత గొప్పవారైనారని భావము. అపగతహేతుఁగ=వైరకారణముఃపోవునట్లుగ త్రిజగంబులను మోదుట యుద్ధపుదురదగల బాహువుల నొప్పుటయు హరహరి పక్షములు రెండింటిలో సమానమే.

### సంస్కృతము

అముష్య త్వత్సేవాసమధిగతసారం భుజవనం
బలాత్ కైలాసేపి త్వదధివసతౌ విక్రమయతః
అలభ్యా పాతాళేప్యలసచలితాంగుష్ఠశిరసి
ప్రతిష్ఠా త్వయ్యాసీద్ ధ్రువముపచితో ముహ్యతి ఖలః

### తెనుఁగు

మును నీభక్తిబలంబుచే భుజవనంబున్-నీవు వాసంబు చేసినకైలాసమునందుఁ గూడఁ గడు వాసిన్-విక్రమింపంగఁ జేసినవీనిన్ గడు సుల్వుగా బొటనవ్రేల్ శీర్షమందుంచి యందనిపాతాళముఁ జేర్తుఁ వుద్ధతుఁడు భగ్నాత్ముండు కాడే భువిన్.

హరపక్ష:- భుజవనంబున్=భుజసమూహమును.రావణుడు కైలాసఘుమెత్తబోవునపుడు [వీనిన్=రావణుని] తలపైని హరుఁడు బొటన [వ్రేలితో నొక్కెనని పురాణగాథ.హరివక్ష:-భుజవనంబు= [దాన సమయములో] హస్తజలమును, కైలాసమునందు= కేలిప్రయోజనము గలది కైలము కైల+ఆసము ఆసనము గలది=త్రిలోకము అత్రిలోకమునందు వామనునికి దానజలమును విక్రమింపఁగ=విశేషముగ సంక్రమింపఁజేసిన వీనిన్= బలిచక్రవర్తిని, బొటనవ్రేల్ శీర్షమందుంచి పాతాళము చేర్చితివి.

## సంస్కృతము

యదృద్ధిం సుత్రామ్ణో వరద పరమోచ్చైరపి సతీ
మధశ్చక్రే బాణః పరిజనవిధేయత్రిభువనః
న తచ్చిత్రం తస్మిన్ వరివసితరి త్వచ్చరణయో
ర్నకస్యాఉన్నత్యై భవతి శిరసస్త్వయ్యవనతిః

## తెనుఁగు

వరగతి యైనదేవపతి, బాణమహోన్నతి యుత్తమస్థితిన్
బరిచరవశ్య మౌత్రిభువనంబుల మించియుఁ గ్రిందఁజేసె నో
వరద!విచిత్రమేమిటఁ,ద్వచ్చరణంబులు గొల్చుచోటయందు
మూల మౌ శిరమ్మును వంచి నీకు నతిచేసిన
నెవ్వఁడు గాంచ డున్నతిన్

## మహిమ్నః స్తోత్రము

వివ:- హరపక్ష:- వరగతియైనన్=ఇంద్రుడు గొప్పపదవి గలఁ వాడైనను; దేవపతిన్ = ఇంద్రుని ఉత్తమ స్థితితో, పరిచర వశ్యమౌ=(రావణాసురుని) సేవకులకు వశ్యమైన త్రిభువనంబు లను మించియు బాణమహోన్నతి=బాణాసురుని మహోన్నతి ఇంద్రుని క్రిందు చేసెను. దానికి నీచరణ సేవయే మూలము. హరిపక్ష:- వరగదియైన=గొప్పపదవిగల, దేవపతి=ఇంద్రుని యొక్క, బాణమహోన్నతి యుత్తమస్థితితో, త్రిభువనములను మించియు క్రిందుచేసె, అనఁగా వానినిమించి పైకి అంతట వ్యాపించెను. హరీ! దీనికి త్వచ్చరణసేవ మూల మనిభావము.

### సంస్కృతము

అకాండ బ్రహ్మాండక్షయ చకిత దేవాసురకృపా
విధేయస్యాఽఽసీద్ యస్త్రినయన విషం సంహృతవతః
సకల్మాషః కంఠే తవ న కురుతే న శ్రియమహో
వికారోఽపి శ్లాఘ్యో భువన భయభంగవ్యసనినః

### తెనుఁగు

మును బ్రహ్మాండ మకాలమందె యణఁగన్ బొల్పేదు దేవాసురా
శిని జాలిన్ వశమై త్రినేత్ర! విషమోలిన్ గ్రోలు నీకంఠ మం
దునె యొప్పారెడు నీలిమం బెవరికిన్ సుశ్రీ నిడం జాలదే
ఘనలోకార్తినివారణ వ్యసనికొఁ గా సొంపె పైరూప్యమున్

## మహిమ్నః స్తోత్రము

విన:- హరపక్ష:- త్రినేత్రః క్షీరసాగర మథనములో పుట్టిన హాలాహలముచే బ్రహ్మాండము ఆకాలములో అణఁగిపోఁగా దేవాసురాళియందు జాలిచే వారికి వశమై విషము త్రాగగా నీకంఠము నల్లఁబడియె. అది అందఱకును శ్రీని సంపదను అందమును గూర్చ దా కూర్చునని భావము. అవి రూపత్వమును నీకు పొంపె, హరిపక్ష:- త్రినేత్రః=త్రిలోకములకు నేత్రమువలె భాసించు హరీ! ఆకాలములో ప్రళయము సంభవింతఁగా బ్రహ్మాండము అణఁగిపోఁగా నీటిలో ప్రపంచము మునిగిపోఁగా దేవాసురులందు జాలిచే వశమై వరాహమూర్తివై విషము అనఁగా ఆ నీటిని త్రాగి రక్షించితివి. అపుడు నీ కంఠము అనీటిలో, బురద అంటుకొని నల్లఁబడెను అది నీకుఅందమె యయినది. అది సుశ్రీని చక్కని శోభను ఇడును. లోకముల ఘన కష్టములు పోఁగొట్టుటె వ్యసనముగాఁ గలవానికి అవనిలో కలిగిన వైరూప్యమును పొంపె యగును.

### సంస్కృతము

అసిద్ధార్థా నైవ క్వచిదపి సదేవాసురనరే
నివర్తంతే నిత్యాం జగతీ జయినే యస్య విశిఖాః
వి పశ్యన్నీశ త్వామితరసుర సాధారణ మభూత్
స్మరః స్మర్తవ్యాత్మాన హి వశిషు పథ్యః పరిభవః

### తెనుఁగు

నిరతంబున్ జయ మొందు నెవ్వనిశరానీకంబు నెందైన నీ
నరదేవాసుర సర్వలోకభువులున్ వ్యర్థంబయై మర్లదా
స్మరుఁడీశా!యిటు నిన్ను నన్యసురసామాన్యంగ నీక్షించియున్
స్మరణీయాంగుఁడె యయ్యెఁగా; పరిభవాళల్ పథ్యమే ధీరులన్.

మహిమ్నః స్తోత్రము

వివ: హరపక్షః- పార్వతిపయి ప్రేమ కలుగుటకై మన్మథుఁడు నిన్ను అన్యులైన దేవతలతోపాటు సామాన్యునిగాఁదలఁచి(నీపై బాణములు వేయగా నీవు మూఁడవ కన్ను తెఱవగా) స్మరింప దగిన శరీరము గలవాఁడై భస్మమైన దేహముగలవాడయ్యెను, ధీరులను తిరస్కరించుకోర్కెలు మంచివిగావు. హరిపక్షః-ఈశా! ప్రభూ! అన్యసుర!=విలక్షణమైన దేవా! హరీ! ఆ గొప్ప మన్మథుఁడు సామాన్యంగ=నీతో సమానునిఁగదన్ను అనుకొని నిన్ను జన్మసమయములో ఈక్షించియు స్మరణీయ=అందముగా స్మరింపఁ దగినయంగములు కలవాఁ డయ్యెను. అట్టివాఁ డైనను, పరిభవాశల్=పరిభవతి=అనర్థమందు యోజయతి=యోజింపఁ జేయువాఁడు గాన పరిభవుఁడు=మన్మథుడు. ఆ మన్మథునియాశల్ ధీరులందు పథ్యమే=మంచివా కావు, ధీరులవిషయమై వారిని మోహమునఁ బడవేయు కోర్కులు మంచివి గా వని భావము.

సంస్కృతము

మహీ పాదాఘాతాద్ వ్రజతి సహసా సంశయపదం
పదం విష్ణోర్భ్రామ్యద్భుజపరి ఘరుగ్ణగ్రహగణం
ముహుర్ద్యౌర్దౌస్థ్యం యాత్యనిభృతజటాతాడిత తటా
జగద్రక్షాయై త్వం నటసి నను వామైవ విభుతా.

తెనుఁగు

కుపతితదిష్టపద్ధతుల క్షోణియు వెంటనె దద్దరిల్ల, వి
ష్ణుపథిఁ జలద్భుజాపరిఘశోభ గ్రహాదులు సంచరింప, వీ
డి వడఁజటాళి కొట్టి దివి లీల విజృంభణ చేయ ప్రుక్కఁగా
నెపుడు జగాలు బ్రోవ నటియింతు విచిత్రము నీ ప్రభుత్వముల్

## మహిమ్నః స్తోత్రము

**వివ:** హరపక్ష:- హరా! కు=భూమిమీద, పతిప=పడినదై, దిష్ట=ధర్మముల నాదేశించిన, పత్=పాదముల,హతుల=న్యాసములచే భూమి దద్దరిల్లిపోవఁగ, విష్ణుపథి=ఆకాశము. నీనాట్యములో కద లెడి రోకళ్ళవంటి భుజముల శోభచే సూర్యాది గ్రహములు నక్ష త్రములు సంచరించుచుండఁగా విడిపోయిన నీ జడలు సోకి కొట్టఁగా సులువుగా జటా విజృంభణచే దివి=స్వర్గము సుక్కి పోవఁగా నీవు నటింతువు. ఇట్లు లోకక్షోభ జరుగుచున్నను నీవు నటింతువు. ఇట్టి నీ స్వేచ్ఛా ప్రభుత్వములు విచిత్రములు.

హరిపక్ష:- కుపతి=దుష్టరాజులయొక్క, తదిష్ట=వారికిష్టమైన పద్ద తుల=దుష్టపాలనా పద్ధతులచే, భూమువణంకి పోఁగా, విష్ణుపథి=విష్ణు వ్యాపకమైన నీ పథి=యజ్ఞాదిక మార్గము, యజ్ఞవస్తువుల దంచుటలో కదలు చేతులందలి రోకళ్ళ శోభచే. గ్రహాదులు=యజ్ఞదేవతలగు గ్రహాదులు=సోమాదిగ్రహాదులు సంచరింపఁగా నాస్తికులు మామతము గొప్పదని విఱఁబోసికున్న జటాళులచేఁ గొట్టి లీలగా విజృంభింపఁగా దివి=స్వర్గము నుక్కఁగా బాధప డఁగా అప్పుడే ఈ మహాపదలనుండి లోకములను రక్షింపఁగా నటింతువు=శ్రీరామకృష్ణాద్యవతారములతో నటింతువు ఇట్లు ఆప దలు రప్పించుటయు, వాటినుండి ప్రోచుటయు నెందుకు. తిన్న గా ఆపదలు రాకుండఁజేయ దా యఁనగా దానికి నీ ప్రభుత్వ ముల్ విచిత్రములు. ఇట్టి విచిత్రమైన ని భావములు మాకుఁ దెలియరావని భావము.

# మహిమ్నః స్తోత్రము

## సంస్కృతము

వియద్వ్యాపీ తారాగణగుణిత ఫేనోద్గమరుచిః
ప్రవాహో వారాం యః పృషతలఘుదృష్టః శిరసి తే
జగద్ద్వీపాకారం జలధివలయం తేన కృతమి
త్యనేనైవోన్నేతరధృతమహిమ దివ్యం తవ వపుః

## తెనుఁగు

నురుగుల్ చిమ్మెడి గంగకాంత నుడుపంక్తుల్ పెంప'మిన్నెల్ల నీ
ర్ఝర మౌనే జలపూర మింత నలుపై త్వన్మూర్ధమందొప్పె న
య్యరె యూనల్పన వార్ధి చుట్టినజగం బయ్యెన్ మహాద్వీపమై
వరదా! దీనినిబట్టి దివ్యమహిమ త్వద్దేహ మూహింపనౌ

హర:- శివుని శిరస్సుపైనున్న యా గంగాజల ప్రవాహము చిన్న నీటి నలుసుగా నున్నను భగీరథుని తపస్సుచే భూమికి వచ్చి యంతటి సముద్రాలుగా అయినదనిభావము. హరిపక్ష:- త్రివిక్రమావతారములో ఆకాశగంగ నలుసు గానున్నదే అయి వనూ సముద్రాలుగా భూమిని పాతాళమునందుమ నిండినదని భావము.

## సంస్కృతము

రథః క్షోణీ యంతా శతధృతిరగేంద్రో ధనురథో
రథాంగే చంద్రార్కౌ రథచరణ పాణిః శర ఇతి
దిదక్షోస్తే కోఽయం త్రిపురతృణమాడంబరవిధి
ర్విధేయైః క్రీడంత్యో న ఖలు పరతంత్రాః ప్రభుధియః

## మహిమ్నః స్తోత్రము

### తెనుగు

మునుక్ష్మాఁ బోలురథంబు పద్మభవునింబోల్ సూతు దద్రీంద్రుఁ
బోల్ ధను. వర్కేందుల్రిలబోలు చక్రములు శ్రీలక్ష్మీసుఁబోల్ బా
ణముస్ గొనినావింతటి యత్నమా త్రిపుర రక్షోఘాసముంగాల్ప
గోరిన నీకుస్ప్రభుపుల్ స్వతంత్రులు సదాక్రీడింతుర్ వశ్యాస్తితో

వివ:హరపక్ష:-క్ష్మానుబోలు రథమును=భూమియంతటి రథమును అనఁగా భూమినె రథముగాఁ జేసికొని అని భావము. ఇట్లే మిగిలిన వానియందు, లేక, క్ష్మాను=భూమిని పోలు=(తనకు) తగిన రథము రథముగాను, పద్మభవునిన్=బ్రహ్మనే, పోలు=(తనకు) తగిన సూతుడుగాను, అద్రీంద్రు=మేరు పర్వతమునే, పోలు ధనువు=(తనకు) తగిన విల్లుగాను, అర్కేంద్రులన్=సూర్యచంద్రులనె, పోలిన=(తనకు)తగిన బాణముగాను కొనితివి=గ్రహింతివి, త్రిపురాసురు లనెడిగడ్డిని కాల్చ నీకు ఇంత ప్రయత్నమా. వశ్యాస్తితో=వశమందున్న వస్తువులతో ప్రభువులు క్రీడించుట సహజము.

హరిపక్ష:- భూమివలె స్థిరమైన రథము బ్రహ్మవంటి సూతుఁడు మేరువు వంటి ధనుస్సు, సూర్యచంద్రులవంటి చక్రములు,విష్ణువువంటి బాణమును కొనినావు=గ్రహించితివి. త్రిపుర రక్షోఘాసము=మూఁడు గిరి శిఖరములు గల లంకలోని రాక్షసులనెడి గడ్డిని కాల్చ (రాముఁడవైన) నీకు ఇంత యత్నమా. మిగిలినది సమానము.

## మహిమ్నః స్తోత్రము

### సంస్కృతము

హరిస్తే సాహస్రం కమలబలిమాధాయ పదయో
ర్యదేకోనే తస్మిన్ నిజముదహరన్నేత్రకమలం
గతో భక్త్యుద్రేకః పరిణతిమసౌ చక్రవపుషా
త్రయాణాం రక్షాయై త్రిపురహర జాగర్తి జగతాం

### తెనుఁగు

హరి నీ పాదములన్ సహస్రసక్తమలాలర్పించి పూజించి స్వ
స్థరసన్ జూడ నొకండు తగ్గ నయనాబ్జం బుద్ధరించెన్; సుభ
క్తిరసోద్రేకమె యందుఁ జక్రశుభమూర్తిం జెంది ముల్లోకముల్
పరిరక్షింపఁగ నెప్పుడున్ త్రిపురహర్తా! సిద్ధమై యుండెడిన్.

వివ:_ హరపక్ష;_ త్రిపురహర్తా! విష్ణువు నీ పాదములపై వేయి తామర పూలను సమర్పించి పూజించి స్వస్థరసన్=చక్కఁగాఁను న్న భూమిపై మరల చూడఁగా ఒకండు=ఒక తామరపువ్వు భక్తి పరీక్షకై నీవు ఒక పువ్వును మాయము చేయుటచే తగ్గి పోఁగా అప్పుడు తామరపువ్వు వంటి తన కంటిని ఊడఁబెరికి స మర్పించెను. ఆ భక్తి రసోద్రేకము విష్ణు చక్ర రూపము ధరిం చి మూఁడు లోకములను రక్షించుటకు ఎప్పుడును సిద్ధముగా నున్నది. అని పురాణగాధ.

హరిపక్ష:- త్రిపురహర్తా;=జాగ్రత్స్వప్న సుషుప్తి రూపత్రిపుర ములను హరించిన విష్ణూ! హరి=ఇంద్రుఁడు నీ పాదములను

## మహిమ్నః స్తోత్రము

వేయి కమలములవంటి కన్నులవ్పగించి, పూజించి, స్వస్థ, స్వః=స్వర్గమందు స్థ=ఉన్న రసన్=భూమిపై, చూడన్=చూడఁగాఁ ఒకండే=ఇంద్రుడొకండే తగ్గ=తగిన, నయనాబ్జంబుగా మధించు=నయన=నడుపుటలో, అబ్జ=నీటిలో పుట్టిన లక్ష్మికలుగునట్లుగ మిక్కిలి ఐశ్వర్యముగలుగు నట్లుగా ఉద్ధరించెన్=ఉత్=ఉత్తమముగా. ధరించెను. ఇంద్రుడు స్వర్గలోకమునుధరించెను. అభక్తిరసోద్రేకమె చక్రశుభమూర్తిన్=చక్ర=సేనయొక్క శుభమూర్తిని పొంది మూఁడు లోకములను రక్షింప గలిగియుండెను.

### సంస్కృతము

క్రతౌ సుప్తే జాగ్రత్ త్వమసి ఫలయోగే క్రతుమతాం
క్వ కర్మ ప్రధ్వస్తం ఫలతి పురుషారాధనమృతే
అతస్త్వాం సంప్రేక్ష్య క్రతుషు ఫలదాన ప్రతిభువం
శ్రుతౌ శ్రద్ధాం బధ్వా దృఢపరికరః కర్మసు జనః

### తెనుఁగు

వ్రతు వయిపోవఁ గర్తకు ఫలం బిడ మేల్కొనియుండు వీవ చ
ర్మతతి నశింపఁ గర్మకు ఫలం బెటులౌఁ బురుషార్చ లేకయే:
క్రతువులయందు నిన్గని ఫలం బొసగెడు పూఁటకాపుగా
శ్రుతులను శ్రద్ధ యుంచి జనులన్ బహుదీక్ష నొనర్తు కర్మలన్

వివ;- రెండు పక్షములను సమానమె. పురుషార్చ=భగవంతుని పూజ, యజ్ఞాది పుణ్యకర్మలవలన కలిగిన అపూర్వమనెడి సం

## మహిమ్నః స్తోత్రము

స్కారమే కర్మ ఫలము కలుగువఱకు ఉండుననియు ఇంకఈశ్వ రునితోఁ బనిలేదనియు పూర్వ మీమాంసకులు అందురు. దానికిది ఖండనము.

### సంస్కృతము

క్రియాదక్షో దక్షః క్రతుపతిరధీశ స్తనుభృతా
మృషీణామార్త్విజ్యం శరణద సదస్యాః సురగణాః
క్రతుభ్రేషస్త్వత్తః క్రతుఫలవిధానవ్యసనినో
ధ్రువం కర్తుః శ్రద్ధావిధుర మభిచారాయ హి మఖాః

### తెనుఁగు

తనుభృత్పాలుఁడె యాగకర్తయుఁగ్రియాదక్షుండుదక్షుండుపల్
ఘను లౌమౌనులు ఋత్విజాళుల సురవ్రాతంబు సభ్యాళి యై
నను, తద్యాగ ఫలార్జనవ్యసని జన్నం బెల్ల విధ్వస్తమ
య్యెను నీవల్లనె! శ్రద్ధఁజేయనిమఖా లీకర్త నాశానికే

హరపక్ష:- దేహధారులను బాలించు బ్రహ్మయే యాగకర్త. దక్షుఁడు=దక్షప్రజాపతి క్రియలో దక్షుఁడైనవాఁడు. మౌనులు, ఋత్విజాదులు=ఋత్విక్కులు మొదలైనవారె. సురవ్రాతంబు సభ్యులు. అయినను అట్టి యాగఫలకామియైన యాదక్షప్రజా పతి యజ్ఞమెల్ల నీవల్ల ధ్వంస మయ్యెను. ఎందుచేతననఁగా ఈశ్వరుని శ్రద్ధతో ఆహ్వానింపక పోవుటవల్లనే. హరిపక్ష;- ఓహరీ తనుభృత్పాలుఁడు=ధర్మమును గాక తనువునే ధరించు రాక్షసు

లను పాలించు బలి యోగకర్త. అతఁడు క్రియలలో దక్షుడు + క్రియాదక్షుడు = (క్రియాదక్షుఁడు దక్షుఁడు) ఉత్ = ఉత్కృష్టమైన అక్ష = ఇంద్రియములు గలవాఁడును. మౌనులు ఋత్విజాదులు + అసురవ్రాతంబు, మౌనులు ఋత్విజాదులు, అసురవ్రాతంబు = రాక్షసగణము సభ్యాళి అయినన్ అతని యజ్ఞంబు నీవల్ల ధ్వంసమయ్యెను. ఎందుచేతననఁగా భక్తులైన యింద్రాదిదేవతలందు ఆ బలికి శ్రద్ధ లేక యజ్ఞములు చేయుటచేత. అట్టి వాని యాగములు కర్తయొక్క నాశనమునకే యని భావము.

## సంస్కృతము

సతాం వర్మ్యత్యక్త్వా శ్రుతి సమధిగమ్యం సహభువం
ఘృణామప్యన్మాల్య స్వజనవిషయ స్నేహగుణితామ్
ద్విజః కృంతన్నాదేపితరమపరాద్ధం త్వయి విభో
మనుష్యత్వం సద్యస్త్రిదశ పరిణామేనవిజహౌ

## తెనుఁగు

క్షితిసుత బల్మిఁ గోరు దశశీర్షమతుల్ భ్రమ పెట్టనాడు లేఁ
డి తనువుఁ బూన క్రీడఁ బలులీలలఁ దేర్చు మహాసురున్ మృగా
కృతు భయభీతు మేన శర మేసి ద్యువీధిని జేర్చు కూడ సం
తతమును వ్యాధునేగమును నాథ! త్యజింపవు చాపపాణివై

హరపక్ష:- క్షితిన్ = భూమిలో, సుతన్ బలిగోరు = తన కుమార్తెయైన శతరూపనుగోరు, దశను = స్థితితో, శీర్షమతుల్ = తలలోని బుద్ధులు

## మహిమ్నః స్తోత్రము

భ్రమపెట్టనె=ఆశపెట్టగా, ఆశతరూప ఆడులేడి తనువునుపూన= తండ్రి తనతోఁ గలియుటయేమని కుమార్తె అశతరూప సిగ్గుపడి ఆడులేడి శరీరమును పూనియుండఁగా అప్పుడు క్రీడతోఁ బలులీలలఁ దేల్చ మహా+సురు గొప్పదేవని బ్రహ్మను, మృగాకృతు ఆడులేడిలోఁ గలియ మగలేడి రూపమును దాల్చిన యతనిని భయభీతుని=ఇదేమి పనియని శిక్షింపవచ్చు నిన్నుఁజూచి భయ భీతుఁడైన వానిని మేన=శరీరముపైని బాణమేసి, ద్యువీధి=స్వ ర్గవీధిని జేర్చ=(చంపి) కూడ వ్యాధువేగమును నాథ!నీవు మా నవు. అనగా శివుండు బాణము వేయఁగా బ్రహ్మ సిగ్గుపడి మృగ శిర నక్షత్రరూవు దాల్చెను. హరుని బాణము అర్ద్రానక్షత్ర రూ పమును దాల్చెను. ఆ భాగమునకు పూర్వ మందున్న నక్షత్ర సన్నివేశమును మృగవ్యాధమండలమందురు. ఆర్ద్రామృగశిరో నక్షత్రములు ఎవుడును దగ్గరగా నుండుటచే వ్యాదువేషమును త్యజింపవు. అని చెప్పబడెను.

హరిపక్షః- ఓహరి! క్షితసుతను=జానకిని, బల్మి=బలాత్కారముగా గోరు, దశశీర్షసుతుల్=రావణునిబుద్ధులు బ్రమపెట్టఁగా (రావణుని యాజ్ఞచే మారీచుఁడు) అడు=విహరించు లేడియై, తనువుఁ బూన క్రీడఁ=డతో లీలల దేల్చ=లీలలతో రావణుని లేక సీతను సంతో షపెట్టు మహా+అసురు=గొప్ప రాక్షసుడైనమారీచునిమృగాకృ తున్=లేడి రూపమును దాల్చిన యతనిని భయభీకునిని మేన= వానియొక్క శరీరమున (శ్రీరాముఁడవై) బాణము వేసి ద్యువీ ధిని=స్వర్గవీదిని జేర్చి కూడ చంపికూడ చాపపాణివై (కోదండ పాణివై) దుష్టశిక్షణకై వ్యాధుని వేషమును వీడక యుందువని భావము.

## మహిమ్నః స్తోత్రము

### సంస్కృతము

ప్రజానాథం నాథ ప్రసభమభికం స్వాం దుహితరం
గతం రోహిద్భూతాం రిరమయిఋమృష్యస్య వపుషా
ధనుః పాణేర్యాతం దినమపి స పత్రా కృతమముం
త్రసంతం తేఽద్యాపి త్యజతి న మృగవ్యాధరభసః

### తెనుఁగు

స్వీరసాఖ్యన్ ధనువూని ముం రతను శోభల్ గడ్డిగాఁ గాల్చుటన్
పుర సీడాకర పుష్ప యోధునిదశల్ లో నెంచియిన్ సంయమా
దిరతా! సార్ధతనున్ ద్యజించు ఘటనన్ తెల్లంద వీక్షించి యో
పరదా! స్త్రీరతు దేవినిన్ దలఁచె: నప్రౌఢల్ గదా జవ్వనుల్

హరపక్షః- పురసీడాకార!=రాక్షసుల త్రిపురములను బాదించిన హరా! స్వ=తనయందు [పార్వతియందు] రసాఖ్యను=సృంగార సౌందర్య రసఖ్యాతిచేత [హరుడు దుర్జయుఁడైనను పార్వతి కుండు శృంగార సౌందర్య రస ఖ్యాతిచే హరునిఁ గెల్వ వచ్చునని తలఁచి మన్మధుడు] ధనువుఊని=ధనుస్సు ధరించుటచేత ముందు=తనముందెః అతను శోభల్=గెల్వ వచ్చిన మదనుని శోభలు. గడ్డిగా=గడ్డివలె, కాల్చుటచేత పుష్పయోధునిదశన్= భస్మమైన మదనుని యవస్థను లోనెంచికూడ పూరునిదన సౌందర్య ఖ్యాతిచేగెలవరాదని తలచి తరువాతనీవు స్వార్థ[స్వ + అర్ధ] తను=తపోభక్తిని జూచితననగము శరీరమును తనకై త్యజించు ఘటనన్=విడిచిపెట్టిన సంఘటనను తెల్లముగాఁజూచు దేవి=సీతాదేవి నిను స్త్రీరతునిగ తలచెనని భావము.

## మహిమ్నః స్తోత్రము

హరిపక్షః- స్వ=తన (శ్రీరాముని) రసాఖ్యన్=తాను మహావీరు డని వీరరసఖ్యాతిచే, ధనువు ఊని=సీతముందే అతను శోభల్= లంకాపురముయొక్క గొప్ప శోభలు గడ్డివలెఁ గాల్చుటచే పురపీడాకర పుష్ప=పుర=శరీరమున గూడ పీడ కలిగించు సుందరమైన పుష్పముల కంటెను మెత్తని శరీరముగల సీత, యోధుని ధశను=ఆ శ్రీరాముని యోధస్థితిని, లోనెంచియు స్వార్థతనున్= స్వార్థత్వమును, త్యజించి=స్వసుఖమును వీడి సీతకై యుద్ధ కరణాది సంఘటనను తెల్లముగ జూచి దేవి=సీత నిన్ను స్త్రీరతుఁగా దలచెనని భావము. కాని హరుఁడు శ్రీరాముడును పైకి కనిపించినను వారు జితేంద్రియులు భగవంతులని భావము. క్షితసుత అనుదానికి పర్రిజానాధం అన్నది సంస్కృతము.

### సంస్కృతము

స్వలావణ్యాశంసా ధృతధనుషమహ్నాయ తృణవత్
పురః ప్లుష్టం దృష్ట్వా పురమథన పుష్పాయుధమపి
యది స్త్రైణం దేవీ యమనిరతదేహార్థఘటనా
దవైతి త్వామద్ధా వత వరద ముగ్ధా యువతయః

**వివ:** ఇది పై పద్యమునకు మూలము.

శ్మశానేష్వాక్రీడా స్మరహర పిశాచా స్సహచరా
శ్చితాభస్మాలేపః స్రగపి నృకరోటీపరికరః
అమాంగల్యం శీలం తవ భవతు నామైవమఖిలం
తథాపి స్మర్తౄణాం వరద పరమం మంగళమసి.

## మహిమ్నః స్తోత్రము

### తెనుఁగు

విహరణముల్ శ్మశానభువిన్, స్మరహారి పిచాచముర్ సఖుల్
ప్రహితపుమేనిపూఁత చితిభస్మము మాల కపాలమాల యి
మ్మహి నడతల్ సమస్తము నమంగళమయ్యునినున్స్మరించుటన్
మహితుల కీవ యెప్పుడు సుమంగళ మౌదువు కామితప్రదా

హరపక్షః- స్మరహారి!=మన్మథుని హరించిన (చంపిన) వాఁడా! ప్రహితపు=ప్రకృష్టహితమైన, నడతల్=నీ ప్రవర్తనలు. హరి పక్షః- అసారమైన సంసారములో, శ్మశాన భువిన్=శ్మశానము వంటి హర్మ్యాది భూమిలో, విహరణముల్= అజ్ఞానుల)విహారము లు ఉండును. స్మర=స్మరణను అనుస్మరించు వివేకము. హారి హరించు పిశాచముల్ పిశాచములవంటి బంధుమిత్రాది జనులు సఖులు, ప్రకృష్టహితమైన మేనిపూత చితాభస్మము వంటిది. మాల జపాలమాల కపాలమాల వంటిది. లేక కేసపాల్యతే జల ముచే పాలింపబడిన పద్మముల మాల. ఆమాల త్వరలో వాడి పోవునది. ఇమ్మహి నడతలు ఈ భూమిలోని జనుల నడతలు అన్ని అమంగళ మయ్యు పరమేశ్వరునిఁ తెలిసికొను నట్టివి గాక పోవుటచే అమంగళ మయ్యును భక్తిచే నిన్ను స్మరించు నట్టి జనులకు నీవు కామితప్రదుఁడవు గాన సుమంగళ రూపుఁడ వౌదువని భావము.

### సంస్కృతము

మనః ప్రత్యక్చిత్తే సవిధమవధాయాత్తమరుతః
ప్రహృష్యద్రోమాణః ప్రమదసవిలోత్సంగితదృశః
యదాలోక్యాహ్లాదం హ్రద ఇవ నిమజ్జ్యామృతమయే
దధత్యంతస్తత్త్వం కిమపి యమినస్తత్ఖిలభవన్.

## మహిమ్నః స్తోత్రము

### తెనుఁగు

హృది నంతర్ముఖ మౌనున స్సునిచియాయారీతిఁ బ్రాణంబు ని
ల్పి, దమిన్ మై పులకింప హర్షభవవారిన్ నేత్రముల్ నిండఁ బె
య్యేదొలోఁద త్త్వముగాంచి యుం దమృత రూపాంభోనిధిన్ము
న్గినట్లెదనానందముసంయముల్ గనెద రీవేగాదెయాతత్త్వమున్

వివ:- రెండు పక్షములయందును అర్థము సమానమే. ఈశ్వరు
డు నిత్య జ్ఞానేచ్ఛా ప్రయత్న యుక్తుఁడు కాని సుఖరూపుఁడును
గాఁడు అని తార్కికులు, క్లేశ కర్మ విపాశములచేఁ బరామర్శిం
పఁ బడనివాఁడు ఈశ్వరుఁడు చైతన్యరూపుఁడు. సుఖరూపుఁడు
గాఁడు అని పాతంజలులు. "ఈశ్వరుడు అద్వితీయ పరమానం
దరూపుఁడు" అని విద్వాంసుల యనుభవ రూపమైన ప్రత్యక్ష
ప్రమాణము ఇందుఁ జూపబడెను.

### సంస్కృతము

త్వమర్కస్త్వం సోమస్త్వమసి పవనస్త్వం హుతవహ
స్త్వమాపస్త్వం వ్యోమ త్వము ధరణిరాత్మాత్వమితి చ
పరిచ్ఛిన్నా మేవం త్వయి పరిణతా బిభ్రతి గిరం
న విద్మస్తత్తత్వం వయమిహ కు యత్ త్వం న భవసి.

### తెనుఁగు

ఇనుఁ డీవే శశి వీవె, నీ పనిలుఁ డీవే యగ్ని వీవేజలం
బుసు, నీవేదివ, మీవెభూమవలయంబున్ నీవయాయాత్మయున్
అని పెద్దల్ భువి నిట్లు సంకుచిత వాక్యంబుల్ వచింత్రే గాక క
న్గొనఁగా నీవిటఁగాని తత్త్వ మది యెందున్ లేదు లేదో ప్రభూ!

## మహిమ్నః స్తోత్రము

### సంస్కృతము

హరపక్ష:- హరుఁడు సూర్యచంద్రాద్యష్టమూర్తి యని యాగకర్తలు హరిపక్ష:-ఇనాది పదములు సూర్యాది దేవతాపరములు హరిభగవంతుఁడు సర్వమయుడని సిద్ధాంతము.

త్రయీం తిస్రో వృత్తీస్త్రిభువనమథో త్రీణ్యపి సురా
నకారాద్యైర్వర్ణై స్త్రిభిరభిదధత్ తీర్ణవికృతి
తురీయంతే ధామధ్వనిభిరవరుంధాన మణుభిః
సమస్తం వ్యస్తం త్వాం శరణద గృణాత్యోమితి పదమ్॥

### తెనుఁగు

మును వేదంబులు మూఁటి, మూఁడుదశలన్ ముప్వేల్పులన్
ముజ్జగా,ల న(అ)కారాదులు మూఁటిచే దెలుపు చెల్లన్విక్రియల్
దాఁటిచి,ధ్వనమౌనాల్గవసేదుధామ మణుశబ్దాలన్ప్రబోధించుచున్
గన వ్యస్తంబు సమస్త మౌ నిను శరణ్యా! తెల్పునోంకారమే

వివ; ఇది హరహరిపక్షములు రెండింటిలోను సమానమె. మూఁడు దశలు జాగ్రత్స్వప్న సుషుప్తి దశలు ఇవి విశ్వ తైజస ప్రాజ్ఞుల కుపలక్షణములు. ముప్వేల్పులు=బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టి స్థితి లయముల కుపలక్షణము ముజ్జగములు=భూర్భువస్వర్లోకములు ఇది విరాడ్ఢిరణ్యగర్భవ్యాకృతుల కుపలక్షణము. అకారమునకు ఋగ్వేదము జాగ్రద్దశ భూర్లోకమునకు బ్రహ్మయు అర్థము. ఉకారమునకు యజుర్వేదము స్వప్నదశ

మహిమ్నః స్తోత్రము

భూర్లోకము విష్ణువు అర్థము. మకారమునకు సామవేదము సువర్లోకము మహేశ్వరుఁడు అర్థము. ఇట ఇతరమగు చోటఁ జెప్పఁబడి అధ్యాత్మాధిదైవాదిమాతాధియజ్ఞాదులన్ని సంగ్రహించుకొనవలయును. నీదుధామము అనఁగా, రాహు శిరస్సు అన్న చోట

రాహురూపమైన (రాహువునకు శిరస్సేగాని మొండెము భాగము లేదు గనుక) శిరస్సు అని చెప్పుకొన్నట్లు నీ స్వరూపమైనధామము అని చెప్పుకొనవలయును. అణుశబ్దాదులు=అఉమ్ అను సూక్ష్మమైన ప్రత్యేకముగా ఉచ్చరింపశక్యముగాని సూక్ష్మ శబ్దములు. స్థూలప్రపంచంచోపహిత మైన చైతన్యము ఆకారమునకు అర్థము స్థూల ప్రపంచాంశత్యాగముచేత కేవలం చైతన్యము అకారముచేత లక్షింపబడును. సూక్ష్మ ప్రపంచోపహిత మైన చైతన్యము ఉకారమున కర్థము. సూక్ష్మ ప్రపంచాంశత్యాగముచేత కేవల చైతవ్యము లక్షింపఁబడును. స్థూలసూక్ష్మ ప్రపంచ ద్వయమునకుఁగారణమైన మాయోపహిత చైతన్యము మకారమునకు అర్థము. అట్టి మాయాంశత్యాగముచేత మకారముచేఁజైతన్యమొక్కటే లక్షింపబడును. ఇట్లు సంపూర్ణమైన అద్వితీయ చైతన్యము మాత్రమే సిద్ధమగును. ఋగ్వేదాదులు వాక్యార్థబోధలో ఉపయోగింపక పోయినను ఉపాసనమందు ఉపయోగించును. కాన వేఱుగా జెప్పఁబడెనని తెలియునది. కాన సర్వము ప్రత్యగభిన్నమైన బ్రహ్మమే ప్రణవ (ఓం) వాక్యార్థమనిషిద్ధము. ఇది తత్త్వమసి "అది నీవై యున్నావు. మొదలైన మహా వాక్యముల కొవలక్షణములు.

# మహిమ్నః స్తోత్రము

## సంస్కృతము

భవః శర్వో రుద్రః పశుపతిరథోగ్రః సహమహాం
స్తథా భీమేశానావితి యదభిధానాష్టకమిదం
అముష్మిన్ ప్రత్యేకం ప్రవిచరతి దేవ శ్రుతిరపి
ప్రియాయాస్మై నామ్నే ప్రణిహితనమస్యోస్మి భవతే,

## తెనుఁగు

భవుడున్ శర్వుఁడు రుద్రుఁడున్ పశుపతిప్రఖ్యాతుఁ డీశానుఁ డా
దివిభూ! యుగ్రుఁడు భీముఁడున్ మఱి మహాదేవుం డనంగా నిదే
భువి నామాష్టక మిందె వేదమును సెప్పున్ నిల్చి పేర్వేఱ త
త్త్రివిధేయుండవు శ్రేష్టధాముఁడ, విదే కేల్మోడ్తు నీ కెప్పుడున్

**వివ:** రెండు అర్థముల సమానమే భవాదినామములు హర నామ ప్రసిద్ధములే యైనను వ్యుత్పత్త్యర్థములు హరిపక్షము నను సరిపోవును. సర్వమును (భవతిఇతి) అగును గాన భవుఁడు (శృణాతిశృహింసాయాం దుష్టులను హింసించువాఁడు గాన శర్వుఁడు. రోదయతి = దుష్టులను ఏడ్పించువాఁడు గాన రుద్రుఁడు పశువులకు జీవులకు పతి పశుపతి. ఈష్టే తచ్ఛీలః శాసించు శీలముగలవాఁడు గాన ఈశానుడు చెడ్డవారికి ఉగ్రుఁడు గాన ఉగ్రుఁడువీనివల్ల దుష్టులు భయపడుదురు. గాన భీముఁడు గొప్ప దేవుఁడు గాన మహాదేవుఁడు అని వ్యుత్పత్తి ఈయొక్కొక్క నామమందె వేదమును వేర్వేఱుగా తత్తదర్థబోధకముగా నిల్చె నని తెలియునది.

# మహిమ్నః స్తోత్రము

## సంస్కృతము

నమో నేదిష్ఠాయ ప్రియదవ దవిష్ఠాయ చ నమో
నమః క్షోదిష్ఠాయ స్మరహర మహిష్ఠాయ చ నమః
నమో వర్షిష్ఠాయ త్రినయన యవిష్ఠాయ చ నమో
నమః సర్వస్మై తే తదిదమితి సర్వాయ చ నమః

## తెనుఁగు

జోహారుల్ వికటస్థుకున్ బ్రియదవా! జోహార్లు దూరస్థుకున్
జోహార్ నీ కణుమూర్తికిన్ స్మరహరా! జోహార్ మహామూర్తికిన్
జోహారుల్ ముదివగ్గుకున్ త్రిణయనా! జోహార్ యువావస్థుకున్
జోహార్ సర్వన కయ్యు దియ్యు దగువిష్ణూ! సర్వ! జోహారువుల్

వివ : హర:- ప్రియదవ=అభీష్ట నిర్జన విహార! హరి:- ప్రియదవ!= ప్రియములు విషయసుఖములను వైరాగ్యబాధచే (దునోతి) నశింప జేయువాఁడు. హరి- స్మరహర! స్మరము విషయవాసనను హరించువాఁడా! హరి:- త్రినయన!= మూఁడు లోకములను నయనమువలె భాసింపఁ జేయువాఁడా! హర:- విష్ణూ! సర్వవ్యాపకుఁడా! "దూరాత్ సుదూరే తది హాంతికేచ" దూరముకంటె దూరమునందును దగ్గఱగ ఉండువాఁడు "అణో రణీయాన్ మహతో మహీయాన్" (అణువుకంటె నణువైనవాఁడు గొప్పకంటె గొప్పవాఁడును.) "త్వంస్త్రీ త్వం పుమా నసిత్వం కుమార ఉతవా కుమారీ త్వం జీర్ణో దండే నాఁచసి త్వంజాతో

మహిమ్నః స్తోత్రము

భవసి విశ్వతో ముఖః" నీవు స్త్రీవి నీవు పురుషుడవు నీవు కుమారుడవు కుమార్తెవు నీవు ముసలివాడవు దండముతో ప్రవేశించుచున్నాడవు నీవు విశ్వతోముఖుండవై పుట్టితివి "ఇదం సర్వం యదయ మాత్మా" ఏయాత్మ గలదో ఇదంతయు నీవే "అని శ్రుతులు".

సంస్కృతము

బహులరజసే విశ్వోత్పత్తౌ భవాయ నమో నమః
ప్రబలతమసే తత్సంహారే హరాయ నమో నమః
జనసుఖకృతే సత్వోద్రిక్తౌ మృడాయ నమో నమః
ప్రమహసి పదే నిస్త్రైగుణ్యే శివాయ నమో నమః

తెనుఁగు

లోకాల్ తీర్ప రజస్సు పొందు భవ! పల్ జోహార్లు జోహార్లివే
లోకాల్ చంపఁ దమస్సు పొందు హర, పల్ జోహార్లు జోహార్లివే
లోకాల్ పెంచఁగ సత్త్వ మొందు మృడ! పల్ జోహార్లు జోహార్లివే
జోకన్ నిర్గుణి వైన జ్యోతి! శివ! పల్ జోహార్లు జోహార్లివే

వివ: వీనివల్ల జగములు భవంతీతి కల్గును గాన భవుండు అజ్ఞానమును హరించువాఁడు గాన హరుఁడు. (మృడయతి, సుఖయతి) సుఖపెట్టువాఁడు గాన మృడుఁడు. శివుఁడు మంగళ స్వరూపుఁడు గాన శివుఁడు అని వ్యుత్పత్తులు. ఈ యర్థములు హర హరి పక్షములు రెండింటిని సమానమే.

# మహిమ్నః స్తోత్రము

## సంస్కృతము

కృశపరిణతి చేతః క్లేశవశ్యం క్వ చేదం
క్వ చ తవ గుణసీమోల్లంఘినీ శశ్వదృద్ధిః
కతి చకితమ మందీకృత్య మాం భక్తిరాధా
ద్వరద చరణయోస్తే వాక్యపుష్పోపహారం.

## తెనుగు

నలుసౌ జ్ఞానము కల్గి క్లేశపు వశం బౌనామనస్సేమి ని
శ్చలమౌ సద్గుణసీమ దాటు భవదైశ్వర్యంబునే మంచు మి
క్కిలిభీతిల్లిన నన్ బలాత్కృతిని భక్తిప్రౌఢియే నీపదం
బుల ఈ పద్యపుఁ బూలకానుక వరదా! పూయించి వేయించెఁగా

వివ: క్లేశములు=అస్మితాదు లనెడియోగశాస్త్రోక్త క్లేశ
ములు లేక సంసార క్లేశములు.

## సంస్కృతము

అసితగిరిసమం స్యాత్ కజ్జలం సింధుపాత్రం
సురతరువరశాఖా లేఖినీ, పత్రముర్వీ
లిఖతి యది గృహీత్వా శారదా సార్వకాలం
తదపి తవ గుణానామీశ పారం న యాతి.

## మహిమ్నః స్తోత్రము

### తెనుఁగు

నీరధియంత పాత్రమున నీలమహాచల మంతదౌ సిరా
గూరిచి దేవతా తరువు కొమ్మ కలం, బిల కాగితంబుగాఁ
గోరి సదా సరస్వతి యకుంఠితదీక్ష లిఖించినన్ సరే
పారముఁ జెందనేరవు భవద్గుణముల్ ప్రభు! నేర్తు నేనెటుల్

వివ : సముద్రమంతటిసిరాబుడ్డిలో మహాపర్వతమంత సిరాపోసి కల్పవృక్షశాఖను కలముగాను భూమిఅంతయు కాగితముగాను గ్రహించి సరస్వతి అదేదీక్షతో వ్రాసినను నీ గుణములు ముగియవుగదా. ఇంకనేను వర్ణింపగలనాఅనిభావము.

### సంస్కృతము

అసురసురమునీంద్రైరర్చితస్యేందుమౌళే
ర్గ్రథితగుణమహిమ్నో నిర్గుణస్యేశ్వరస్య
సకలగుణవరిష్ఠః పుష్పదంతాభిధానో
రుచిరమలఘు వృత్తైః స్తోత్రమేతచ్చకార.

### తెనుఁగు

అసురుల్ దేవతలున్ మునీంద్రులు సదాయర్చింప నొప్పారితా
నసలే నిర్గుణుఁడయ్యు ఖ్యాతగుణమాహాత్మ్యుండె యౌ నిందు
మౌళి సురూపంబు నిటుల్ సమస్తసుగుణశ్రేష్ఠుండ యౌ పుష్పదం
తసమాఖ్యుండు స్తవంబు చేసె గురువృత్తాఁన్ మనోజ్ఞంబుగా

## మహిమ్నః స్తోత్రము

వివ : ఇందుర్విడు=చంద్రుడు మౌళియందు గలవాడు హరుండు. ఇందు=క్లేదపఱచు=చల్లబఱచు మౌళిగలవాడు హరి.

సంస్కృతము

అహరహరనవద్యం ధూర్జటేః స్తోత్రమేతత్
పఠతి పరమభక్త్యా శుద్ధచిత్తః పుమాన్యః
స భవతి శివలోకే రుద్రతుల్యస్తథాఽత్ర
ప్రచురతరధనాయుః పుత్రవాన్ కీర్తిమాంశ్చ.

తెనుఁగు

అమల మీధూర్జటిస్తోత్ర మనుదినంబు
స్వచ్ఛచిత్తుఁడై పరభక్తిఁ జదుపు నెవఁడు
వాఁడు శివలోకమున శివప్రతిముఁ డగుచు
నతి ధనము వాయువును గీర్తి సుతులఁగాంచు.

వివ : ధూ : =భార మైనజటి =జటాసమూహము గలవాడుహరుడు. భారమైనలగ్న కేశసమూహము గలవాఁడుహరి. అతని స్తోత్రము ధూర్జటిస్తోత్రము.

సంస్కృతం

మహేశాన్నాపరో దేవో
మహిమ్నో నా పరాస్తుతిః
అఘోరాన్నాపరో మంత్రో
నాస్తి తత్త్వం గురోః పరం.

## మహిమ్నః స్తోత్రము

### తెనుఁగు

భువి శివునికంటె వేఱె దేవుండు లేఁడు
క్షితిని మహిమస్తుతిని మించుస్తుతియు లేదు
ధర నఘోరమును మించు మంత్రంబు లేదు
తత్త్వమును మించిన గురువదంబు లేదు.

వివ : శివుడు=రుద్రుడు, శుభ మైనవిష్ణువు, అఘోరము =రుద్రునిమూర్తులలో ఒకటి. అట్టి అఘోరమూర్తిని గూర్చిన మంత్రము. అఘోరమైన = కళ్యాణ మైనవిష్ణు రూపమును మించు మంత్రములేదు. గురుపదము= గొప్పస్థా నము.

### సంస్కృతము

దీక్షా దానం తపస్తీర్థం
జ్ఞానం యాగాదికాః క్రియాః
మహిమ్నస్తవపాఠస్య
కలాం నార్హంతి షోడశీం.

### తెనుఁగు

దీక్షదానంబు తపమును దీర్ఘమైన
జ్ఞానమును యజ్ఞము మొదలౌ కర్మలైన
పరమమౌ మహిమస్తోత్రపాఠమునకు
పదయులేవు వ దాఱవపాలుఁ గాని.

# మహిమ్నః స్తోత్రము

## సంస్కృతము

కుసుమదశన నామా సర్వగంధర్వరాజః
శిశుశశిధరమౌళేర్దేవ దేవస్య దాసః
స ఖలు నిజమహిమ్నో
భ్రష్ట ఏవాస్య రోషాత్.

## తెనుఁగు

తాను బుష్పదంతుఁ డను గంధర్వ రాజు
దేవదేవుఁ డౌ శశి మౌళి సేవకుండు
స్వమహిమమునుండి హరునల్క భ్రష్టుఁడగుచు
దివ్యదివ్య మీమహిమస్తుతిని రచించె

## సంస్కృతము

సురమునిపూజ్యం స్వర్గ మోక్షైకహేతుం
పఠతి యది మనుష్యః ప్రాంజలిర్నాన్య చేతాః
వ్రజతి శివసమీపం కిన్నరైః స్తూయమానః
స్తవనమిదమమోఘం పుష్పదంత ప్రణీతమ్.

## తెనుఁగు

మునివర దేవపూజ్యమును మోక్షము, స్వర్గము నిచ్చునట్టిదిన్
అనఘముఁ బుష్పదంతకృత మౌచునమోఘమునైన స్తోత్రమున్
గణపతిశాస్త్రి తెన్గునఁ బొనర్చెను జర్లకులుండు శ్రద్ధతో
జనులు పఠింప నుందురు శివుసన్నిధిఁ గిన్నెరగీయమానులై

## మహిమ్నః స్తోత్రము

### సంస్కృతము

ఆ సమాప్తమిదం స్తోత్రం
సర్వమీశ్వరవర్ణనమ్
అనుపమం మనోహారి
పుణ్యం గంధర్వభాషితమ్

### తెనుఁగు

పావనంబును గంధర్వ భాషితమును
నైన యీస్తోత్రరాజంబు నంతువఱకు
సాటిలేనిది. మిక్కిలిస్వాంతహారి
యీశ్వరుని గూర్చివర్ణిత మెంతొశుభము.

వివ : ఈశ్వరుఁడు=భగవంతుఁడు సర్వేశ్వరుఁడు.

ఇత్యేషా వాఙ్మయీపూజా
శ్రీమచ్ఛంకరపాదయోః
అర్పితా తేన దేవేశః
ప్రీయతాం మే సదాశివః

ఇట్లు వాఙ్మయం బైయొప్పు నిట్టిపూజ
శ్రీదుఁడై మీఱు శంకరు పాదములను
అర్పితం బయ్యెః దీన దేవాదిరాజు
నీ సదాశివుఁడును నాకు నెలమి యిడుత॥

## మహిమ్నః స్తోత్రము

శం= శుభమును కరుడు=గలిగించువాఁడు. సదా=ఎల్లపుడును శివుడు=శుభమైనవాఁడు.

### సంస్కృతము

తవ తత్త్వం న జానామి కీదృశోఽసి మహేశ్వర
యాదృశోఽసి మహాదేవ తాదృశాయ నమో నమః

### తెనుఁగు

వర! మహేశ్వర! నీవెట్టివాఁడవొ గద
నీదుతత్త్వంబు పూర్తిగా నే నెఱుంగ
ఎట్టివాఁడవొ యట్టి నీకిపుడె దేవ
అనఘ: యోమహేశ! యిదె జోహార్ జొహారు.

విష్ణువు : ఒకసారో రెండుసార్లో. మూఁడుసార్లో పఠించువాఁడెల్ల చాల ముక్తుఁడై శివలోకాన మించును.
లోకాన = శుభలోకమందు.

### సంస్కృతము

ఏకకాలం ద్వికాలం వా
త్రికాలం యః పఠేన్నరః
సర్వపాపవినిర్ముక్తః
శివలోకే మహీయతే.

## మహిమ్నః స్తోత్రము

ఒకసారో రెండుసార్లో మూడుసార్లో పఠించినన్
అన్నిపాపాలనుండి ముక్తుడై శివలోకాన దివ్యడౌ .

శ్రీపుష్పదంతముఖపంకజనిర్గతేన
స్తోత్రేణ కిల్బిషహరేణ హరప్రియేణ
కంఠస్థితేన పఠితేన గృహస్థితేన
సుప్రీణితో భవతి భూతపతిర్మహేశః.

మున్ను శ్రీపుష్పదంతుని మోముఁ దమ్మి
నుండి వెడలి పాపముఁ బాపుచుండి హరుని
ప్రియ మయిన స్తోత్ర మెలమి వర్ణించి శ్రద్ధఁ
జదువ భూతేశుఁ డీశుండు ముదము పొందు

హరుని = పాపముల హరించు శివుని విపును.

శ్రీ చర్లనారాయణశాస్త్రి జనక గురు వర ప్రాప్త విద్యుఁడును వెంకమాంబా పుత్రుఁడును అర్షగ్రంథ రచయితయునైన చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన శ్రీపుష్పదంతకృతమైన మహిమస్తోత్రము.